SREE VAGVALLI SERIES No. 11.

# శ్రీ రామశతకము.





ఇది-

శ్రీ బాలా త్రిపురసుందర్యంబా

ప్రణీతము.

శ్రీ తల్పగిరి మాహాత్మ్యాది గ్రంథకర్తయు,
నెల్లూరు శ్రీ వేంకటగిరి మహారాజాగారి కాలేజీ
ఆంధ్ర సహోపాధ్యాయులునగు

శ్రీమాన్ కొమాండూరు వేంకట రామానుజాచార్యులచే

ప్రకటితము.

నెల్లూరు, ప్రభాతముద్రణాలయమున ముద్రితము.

సర్వస్వామ్య సంకలితము]   భావ-పుష్యము   [వెల రు. 0—3—0.

Vol III   No. 3.

# గ్రంథ ప్రశంస.

ఈ శతకమును రచించినవారు శ్రీబాలా త్రిపుర సుందరీ దేవిగారు. వీరు గుంటూరు మండలవాస్తవ్యులు ఈశ్వర యిత్రి పరాభవ సంవత్సర శ్రావణ బ. ౧౧ లు బుధవారమునకు సరియగు హూణ శకము 1906 ఆగష్టునెల తే 15 దిన జన్మించిరి. జననియగు శ్రీమతి నాగమణ్యాంబగారి యొద్ద నీమె సంగీత సాహిత్యాది విద్యల నభ్యసించిరి. అనంత కల్యాణగుణ పరిపూర్ణుఁడగు భగవంతుని గూర్చి వందలకొలఁదిగ భక్తిరసంబు వెదజల్లెడి కీర్తనలు విరచించి యానందించిరి. ప్రస్తుతము నెల్లూరుస్టేషనరీ సబ్ మేజస్ట్రేటు గారైన మ.రా.రా.శ్రీ దాసరి శ్రీరాములునాయుఁడుగారి ధర్మపత్ని. వీరి యిష్టదైవము రామచంద్రమూర్తి యగుటఁ దనకుఁ బ్రత్యక్ష దైవమగు భర్తనామమును శ్రీరామచంద్రుని స్మరణతో నధ్యవసించి యీపతిప్రాణ రకార ప్రాస శ్రీరామ కందశతక మొకటియు రామచంద్రశతక మొకటియురచించిరని తోఁచెడిని. ఈసాధ్వి కవిత మృదుమధుర పదలితమై భక్తిభావ విలసనమై యొప్పుచున్నయది. ఈమెవాణి నవీనభావకవితలవలె నిచ్చవచ్చిన గతులఁబడిపోక శిక్షితులగు పూర్వకవుల యను శాసనములవలె మంచి మార్గముల సరళముగ నడచుచున్నది. ఇం దేపద్యమును జదివినను పరమపద

సోపానములై భక్తిరసము చిప్పిలుచుఁ గరతలామలకములై యున్నవి. భక్తిరసపూరితములగు గ్రంథముల రచించిన శ్రీతరిగొండ వేంగమాంబ. గుండు అచ్చమాంబ-కంచనపల్లి కనకమ్మగార్లవలె నీమెయుఁ దన వాక్కుసుమముల శ్రీరామచంద్రునిం బూజించి కృతార్థయైనది. ఈమె వయసునఁ జిన్నదియైనను దనహృదయ మితరచింతలఁ జొరనీయక పరమమగు భక్తివిషయముననే తనకవితాఝరిఁ బ్రవహింపఁ జేయుట శ్లాఘనీయము.

విద్యావిషయమున వెనుకఁబడి మౌఢ్యదశలోనున్న స్త్రీలలో నిట్టిరత్నములు పొడచూపుట గ్రంథరచనలయందుఁ బురుషులతోపాటు స్త్రీలును సారస్వతపీఠ మలంకరించి భాషాసేవకుం దోడ్పడుట కడుంగడు ముదావహంబు. ఇట్లే బాలికాబాలకులకు జ్ఞానాభివృద్ధిదములగునుత్తమ గ్రంథములు రచించి బుధులయాశీస్సులకుఁ బాత్రియగు నీమె సంతతారోగ్య సౌభాగ్య పుత్రపౌత్రాభి వృద్ధిఁగలిగి చిరకాల మిటుల భాషాసేవఁ జేయుచుండునటుల దైవ మనుగ్రహించునుగాక. విద్యాశాఖాధికారులు నీమె కవితల సమాదరింతురుగాక.

నెల్లూరు,
౧౦-౧౨-౧౯౩౪.

ఇట్లు,
చిల్కపాటి సీతాంబ.

# శ్రీ రా మ శ త క ము



ఈ శతకమును విరచించిన చి॥ సౌ॥ శ్రీ బాలా త్రిపురసుందర్యంబ గారినిగూర్చి, పద్మినీపరిణయమను శృంగారప్రబంధమును, సముద్రమథన మను నామాంతరమునుగల విష్ణుమాయావిలాస నాటకము మున్నగు పెక్కుకబ్బముల విరచించిన శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు ముచ్చటించి యుంటచే మరల నీ కవయిత్రింగూర్చి యుగ్గడించుట చర్విత చర్వణంబని విరమించి నారము.

తే-గీ॥ పతియ చుట్టంబు పక్కంబు పతియ చెలియుఁ
బతియ తల్లియుఁ దండ్రియుఁ బతియ గురువుఁ
బతియ దైవంబు గావున నతని నెపుడు
బత్తిఁ గొలుచుట ధర్మంబు పడతి కరయ.

అను భారతనీతి ననుసరించి పైశతకమును రచించిన కవయిత్రి చి॥ సౌ॥ శ్రీ బాలా త్రిపుర సుందర్యంబకు మంగళాశాసన పూర్వకముగ నొసంగిన పంచరత్నములు.

చ॥ కవన మలభ్య మందఱిఁ గల్గెను బో మఱి దైవ చింతల
న్దవులు ట భావ; మీపగిది దాశరథి న్దదధీనచిత్తతన్
బ్రవిమల పద్యరత్నముల భక్తిసమర్చనఁ జేసి ధన్యవై
భువిఁ దనవాణి సార్థకమువొందఁగఁ జేయుట శ్లాఘ్య
[మారయన్.

క॥ తరిగొండ వేంగమాంబకు
నరరామాయణము భక్తి వ్రాసిధరిత్రిన్
చిరకీర్తిఁ గనినమొల్లకుఁ
దరమని పల్కంగ నీమె తగియె మనీషన్.

మ॥ స్థిరవిద్యాపరతంత్రుఁ డూర్జిత నయశ్లిష్టక్రియాశాలి భా
సురవిజ్ఞాన వివేక శాంతినిధి సుశ్లోకుం డగణ్యుండు దా
సరి శ్రీరాములు నాయుఁడన్నతని సాక్షాద్రామభద్రుండుగా
వరహృత్సీమఁదలంచె సాసతులకు న్నాభవ్యంబుగాదేమిటన్.

క॥ పతిమన్నన శ్రీసీతా
పతి సత్కరుణారసంబుఁ బడసి యిటుసర
స్వతికృపకుఁ బాత్రయగా నీ
సతిపుట్టువు ధన్యమయ్యె జగతీస్థలిలోన్.

క॥ శోభనగానముల కిరవగు
శ్రీబాలా త్రిపురసుందరీ యంబను గా
రాబంబున శ్రీపతి శ్రీ
ధీబలములఁబ్రోచుగాత దీర్ఘాయువులన్.

కొమాండూరు వేంకటరామానుజాచార్యులు,

పత్రికాధిపతి.



శ్రీమాన్ కొమాండూరు వేంకటరామానుజాచార్యులుగారు.



# శ్రీరామశతకము.

క. శ్రీరఘుకులమణీ శ్రీ సీ
తారమణీహృదయలోల ♦ దశరథరామా
నేరములసైచి ప్రోవవె
వారిజభవ హర సురేంద్ర ♦ వందిత రామా. 1

క. వారిజలోచన నీపద
వారిజముల్ మదినిగొల్తు ♦ వారిజనాభా
సూరిజన స్తుత చరణా
వారిజభవ, హర సుపూజ్య ♦ భవహర రామా. 2

క. ధారుణిలోఁ గలజనులకుఁ
దారకమై వెలసినట్టి ♦ దశరథరామా
ధీర సుభ్రాజిత రఘువర
నీరద సమవర్ణవిజిత ♦ నిశిచర రామా. 3

క. ధరణీభారము మాన్పఁగ
వరమునఁ బుట్టితివి నీవు ♦ వసుధేశుఁడవై
హరినీల తులిత గాత్రా
గిరిజాధిప వినుతకీర్తి ♦ కేశవ రామా. 4

క. శరణు శరణు పాలింపుము
వరమునిసతి నేలినట్టి ♦ పాద రజమునన్
తరుణాబ్జారుణ లోచన
కరికలభ సమాన గమన ♦ కావుము రామా. 5

క. సరగునఁ గౌశికుతోఁజని
తరుణి నతనియాజ్ఞఁ గూల్చి ♦ దండక వనిలో
కరుణమెయి మునులఁ బ్రోచితి
వరకర్మలు సాగఁజేసి ♦ వసుధను రామా. 6

క. నరరూపధారివై నిశి
చరు మారీచుని బయోధి ♦ శరమొక్కటఁ జె
చ్చరఁ బడఁగఁ జేసితివి నీ
చరితను వర్ణింప నాకు ♦ సాధ్యమె రామా. 7

క. ఘోరాకారు సుబాహుని
ఘోరాజిఁ దునిమినట్టి ♦ కోమల గాత్రా
వీరాధివీర మునినుత
రారా ననుగావ వేగ ♦ రాఘవరామా. 8

క. నరనుత కౌశికుయాగము
కరమర్థిఁ గాచితీవు ♦ కలుషముడిపి నీ
వరసోదర సహితుఁడవె
పురాణపురుషుఁడవు విశ్వ ♦ పూజిత రామా. 9

క. పురుషోత్తమ పొగడఁగ నా
తరమా! నీపాదమహిమ ♦ తరుణినిజేసెన్
సిరిచెడి సిలయైయుండిన
వరమునిసతి జనులుపొగడ ♦ వందితరామా. 10

క. నరనుత మిథిలాపురమున
హరువింటిని దున్రించి సీత ♦ హస్తాంబుజమున్
కరమర్థిఁ బట్టి నాఁడవు
తరమె యొరుల కిట్టిసేత ♦ దశరథ రామా. 11

క. ధరణీశులెల్లఁ జూడఁగ
నొరుల కలభ్యయయినట్టి ♦ యువిదను సీతన్
పరిణయము సేసికొంటివి
శరణాగత భరణ చరణ ♦ శాశ్వత రామా. 12

క. పరమపురుష భార్గవు భూ
సురరాముని చేతివిల్లు ♦ సారిదిగొని చె
చ్చెర వాని తేజమెల్లను
హరించి వ్యర్థునిగఁ జేసి ♦ యనిచితి రామా. 13

క. తరణికులాంబుధి సోమా
ధరణీసుతా హృత్సరోజ ♦ తామర సాప్తా
సురముని మనోజ్ఞ భృంగా
శరణాగత భరణ చరణ ♦ జానకిరామా. 14

క. నేరములు మత్కృతంబుల
పారంబులు నీని నెన్న ♦ పాడియె నాపైఁ
గూరిమిగలిగిన నవిగన
కూరక రక్షింపవలయు ♦ నో రఘు రామా. 15

క. సురముని వందిత చరణా!
కరుణాకర రాఘవేంద్ర ♦ కావవె నన్నో
యురగేశ తల్ప కేశవ
హరి శ్రీరఘువీర రార ♦ యచ్యుత రామా. 16

క. కరుణాసాగర నీపద
సరసీరుహములకు మ్రొక్కి ♦ జాలిపడిన నన్
ఉరక యుపేక్షింపక మదిఁ
గరుణించి భరింపుమయ్య ♦ కౌస్తుభరామా. 17

క. నరవర నిను గొనియాడఁగ
సురగురునకు వశమె దనుజ ♦ సూదన నిత్య
స్ఫుర దురురూప మనోః
పరిపాలిత రవితనూజ ♦ భవహర రామా. 18

క. సరసిజ హితకులభూషణ
నిర స్తమదకలుష లవణ ♦ నీరధి బంధా
వర పాదోద్భవ గంగా
పరిపాలిత సగరతనయ ♦ భాస్కర రామా. 19

క. కరుణాకరుండ వగుటనె
కరిరాజును గాచితీవు ♦ కాకుత్థ్సుఁడవై
పరగ ననుగావవే నీ
బిరుదు నిలుపుకొనఁగఁ గలవె ♦ పెద్దగరామా. 20

క. పరమదయాకర నిర్జర
వర పూజిత పాదయుగళ ♦ వారిధిశయనా
పరిపాలిత పాండవహృత
కురువంశపయోధి భీమ ♦ కోసల రామా. 21

క. సురతతి పూజితచరణా
పరాజిత సురద్రుమనికర ♦ భాగ్య వితరణా
కురువంశబీజ భరణా
ధరణిసుతా భరణ నాధ ♦ దశరథరామా. 22

క. దురితము లెడబాపుము శ్రీ
కర కరుణాకర సుధీర ♦ కలుష విదూరా
నరసఖ నీశత్రువులగు
మురముఖ దనుజులను గరుణఁ ♦ బ్రోవవె రామా. 23

క. భూరిదయాకర రఘువర
వారణరా జార్తిహరణ ♦ వరగుణబృందా
నీరధిశయన పరాత్పర
సారసగర్భాదిదేవ ♦ సన్నుత రామా. 24

క. పరువిడి గుహుఁ డతి భక్తిని
నరగునఁ బూజించినట్టి ♦ చరణములివె నే
గురుభక్తిఁ బూజచేసెద
తరింపఁ జేయుదువటంచు ♦ దశరథరామా. 25

క. భారద్వాజార్చిత పద
సారసముల్ మదిఁదలంతు ♦ సరసిజనాభా
భూరికృపాకర రఘువర
సారసభవ వినుత దేవ ♦ సన్నుత రామా. 26

క. ధరణీసుతా మనోహర
ఖరాసురప్రముఖ దనుజ ♦ గర్వాపహరా
వరయోగి హృదయనిలయా
సురూప జితమదన కీర్తి ♦ శోభిత రామా. 27

క. దురపిల్లు భరతునకు నీ
వరపాదుకలొసఁగి రాజ్య ♦ పాలనసేయన్
బరితృప్తుఁ జేసి పనుపవె
మురమర్దన తరణివంశ ♦ భూషణ రామా. 28

క. భరతుఁడు నీపాదుకలను
వరభక్తిని బూజచేసి ♦ వడసె యశంబున్
గురువర్య నీదుపదములె
కరమర్థిం గొలుతు ప్రేమ ♦ కలుగఁగ రామా. 29

క. సరయూతటంబునను నొక
తురగమఖము సేయవెట్లు ♦ దోషము తొలఁగన్
నరభోజనుని వధంబునఁ
బొరయునె కలుషంబు నీకు ♦ భూమిప రామా. 30

క. సురచిరలీలఁ గబంధుని
కరములు ఖండించి వాని ♦ కలుషము దొలఁగన్
గురుశాపవిరతి గంధ
ర్వరూపమునొసంగి గావ ♦ వా రఘురామా. 31

క. సరగున నామొరవినవే
పరమ దయాకర సురేంద్ర ♦ వందిత చరణా
తరణికులవార్ధి సోమా
వరములొసఁగ వేగరావె ♦ వరగుణరామా. 32

క. తరణిసు తా శ్రిత పాదా
శరనిధి గర్వాపహరణ ♦ శరభంగనుతా
పరమపురుష భరతాగ్రజ
సరోజదళనయన! జలధి ♦ శయనా! రామా. 33

క. గురునాజ్ఞ శబరి యాశ్రమ
పరిసరమును వేచి నీదు ♦ పాదార్చనలన్
గరము దనిపి ఫలము లొసఁగి
గురులం జేరంగఁ జనదె ♦ కోసల రామా. 34

క. భరతాగ్రజ! నీదేవికి
పరిభవ మొనరించినట్టి ♦ వాయసమును ను
ర్వర నెవరు ప్రోవఁజాలక
కరమువిడచినపుడు నీవు ♦ కావవె రామా. 35

క. సురవర మాయావినిమై
పరిసరమున డాసి సీత ♦ భయపెట్టిన ఖే
చరి శూర్పణఖను నవ్వుచు
పరాభవముచేసి పనుపఁ ♦ బనిచితి రామా. 36

క. సరగున నామొరవినుమా
పరాకుపడనేల నీకుఁ ♦ బంతమ నాపై
కరినాథుఁడు నాకంటెను
బరిచర్యలు చేసినాఁడె ♦ భాస్కర రామా. 37

క. ఖరదూషణ త్రిశిరుల౯
సురద్రోహుల దునిమి ఋషుల । శోకముడిపి య
ధ్వరములు సాగించుటచే
సురప్రియము చేసితౌర । శోభన రామా. 38

క. కరుణాలవాల నీదగు
శరాగ్ని కెరఁజేసి దివిజ ♦ శాత్రవకోటి౯
సురసంఘు పదవి దృఢముగ
పరిరక్షించితివి గాదె ♦ పావనరామా. 39

క. సుర సాధ్య వినుత చరణా
పరాత్పర జగత్స్వరూప ♦ వరనారి సో
దర నిర్మలచరిత సుధా
కర ముఖ మోహన సురూప ♦ కావవె రామా. 40

క. వరకౌస్తుభ మణిభూషణ
కరుణాకర రాఘవేంద్ర ♦ కరుణింపఁగదే
సరసీ రుహోద్భ వార్చిత
చరణయుగళ శ్రీనివాస ♦ జయ రఘురామా. 41

క. సుకచిరలీల కబంధుని
బరిమార్చిన దేవదేవ ♦ భవ్యగుణాఢ్యా
పరమేశ పరమపూరుష
సరగునఁ గృపఁజూడవయ్య ♦ జానకిరామా. 42

క. నరనాథ శబరియొసఁగిన
వరఫలముల నెంగిలనక ♦ వాత్సల్యతమై
పరమప్రీతి భుజించితి
వరయఁగ నీచిత్తవృత్తి ♦ యగునే రామా. 43

క. చరితము సరిగాదని యా
సురపతి సుతు వాలి విడచి ♦ సుగ్రీవునితో
వరమైత్రి నెఱపి సీతా
హరు హరియించితివి కావె ♦ యచ్యుత రామా. 44

క. భరతుండు నీవు లేమిని
నరనాథ యయోధ్యవిడిచి ♦ నందిగ్రామం
బు రతిమెయి నెలవుగాఁ గొని
పరితప్తుం డగుచు నేలెఁ ♦ బావన రామా. 45

క. శరణనివేఁడ విభీషణుఁ
డరిసోదరుఁడనక ప్రోచి ♦ తదియకదా నీ
వరప్రతిన లోకరక్షణ
కరుణాలయ నీకుసవతు ♦ గలరే రామా. 46

క. వీరావతార దక్షిణ
పారావారంబుఁగట్టి ♦ ప్రౌజుల నటపై
నారూఢి నడపి రావణు
ఘోరాజిఁ దునుమవెట్లు ♦ కోసలరామా. 47

క. శరణాగతులను గాచెడి
దొరవీవని నమ్మినాను ♦ దురితవిదూరా
సరసీరుహాక్ష భక్తుల నీ
కరుణకు సత్పాత్రమేను ♦ కానఁటె రామా. 48

క. సురవైరియనుజుఁ గాచితి
సురేంద్రసుతుఁ గూల్చి వాని ♦ సోదరునకు గా
పురహరుని విల్లువిఱిచితి
సరోజముఖిఁ గొఱకుఁ గాగ ♦ శాశ్వతరామా. 49

క. కరువలిసుతుండు నీవర
చరణంబు లపేక్షఁ గనెనో ♦ చనసది మొదలే
వరభక్తుండై తానును
గరుడుని పెన్నుద్దియయ్యె ♦ కాదే రామా. 50

క. వారిజ దళసమనయనా
నేరములను సైచి ప్రోవు ♦ నీరదగాత్రా
వారిజభవముఖ సంస్తుత
సారయశోధామ భక్త ♦ సంశ్రితరామా. 51

క. సురవరుల ప్రార్థనన్విని
నరముఁడవై ధరజనించి ♦ వాడిమొఱసి ని
ష్ఠురచరితు రావణాసురుఁ
బరిమార్చితి గాదె భక్త ♦ పాలక రామా. 52

క. వరసుతులు లేక బహు వ
త్సరములు కృశియించికాంచె ♦ దశరథుఁడు మిమున్
హరిబాహు చతుష్కమువలె
ఖరముఖ్యులఁ దునిమినట్టి ♦ ఘనుఁడవు రామా. 53

క. ఉరమున ముక్తాహారము
నురుతర రుచిమెఱయ నొప్పు ♦ లోలి కెడి మేనున్
కరికలభగమనమునఁ జె
చ్చెర నను జేరంగరార ♦ సీతారామా. 54

క. శ్రీరఘురామ పరాత్పర
శ్రీరమణా హృదయలోల ♦ శ్రితజనపాలా
శ్రీరఘువంశ విభూషణ
నేరములను సైచియేలు ♦ నిజముగ రామా. 55

క. హరిణీశ విజయ భాస్వగు
ఖరసోదరు బంధుయుతము ♦ గాఁ గూల్చిననీ
శరపాటవంబుఁ బొగడఁగఁ
దరమే మముబోంట్ల కెన్న ♦ దశరథరామా. 56

క. సురపతి పూజితచరణా
నిరతము నినువేఁడినాను ♦ నీరజగాత్రా!
మరువకు శ్రీరఘువర నను
ధరణిసుతా ప్రాణనాథ ♦ దశరథ రామా. 57

క. సురరంజన రిపుభంజన
శరభంజన సర్వలోక ♦ శాశ్వతకీర్తీ
శరభంగముఖ మునీశ్వర
వర దాభయదత్తలోక ♦ వందిత రామా 58

క. నీరజ బంధుకులోద్భవ
వారిజరిపువదన మౌని ♦ వర హృత్సదనా
కూరిమితో నన్గావవె
వారిజభవముఖ సురేశ ♦ వందితరామా. 59

క. నిరతము మీపాదంబుల
భరతుండు పూజించునటుల ♦ భయభక్తులతో
స్థిరగుణ నేంబూజించెద
ఖరకరకుల వార్ధిసోమ ♦ కావవె రామా 60

క. తరణికుల వార్ధి సోమా
నరవర దేవాదిదేవ ♦ నా మొరవినవే
సురమునిసేవిత చరణా
గరుడగమన నన్నుగావు ♦ ఘనముగ రామా. 61

క. వరదండక వన నిలయా
సురలోక విరోధిదనుజ ♦ సూదన విజయా
పరిహృత కోసల జన కా
తరభావ నిరస్త కలుష ♦ దశరథరామా. 62

క. ధరణీశ వినుతచరణా
కరిణీశ విపత్తిహరణ ♦ కౌస్తుభ ధరణా
ధరణిసుత భరణ శాశ్వత
కరణవిభీషణ ప్రభుత్వ ♦ కౌశలరామా. 63

క. సురవైరివైరి శ్రీరఘు
వర నామొరవిన వదేల ♦ వనరుహనేత్రా
సరసీరుహా భవవందిత
చరణా దేవాదిదేవ ♦ జగదభిరామా. 64

క. సరసిజబాంధు కులోద్భవ
సరసిజభవ హార సురేంద్ర ♦ సన్నుత నామా
స... ..ళ సమనయనా
...సజనాభా నుతింతు ♦ జానకిరామా. 6

క. నీరజదళ సమనయనా
మారుతి సంసేవ్యచరణ ♦ మదరిపు హరణా!
కూరిమి నిను భజియించెద
వారణ రాజార్తిహరణ ♦ వరగుణరామా. 66

క. సుర గరుడోరగ వర కి
న్నర కింపురుష పురుహూత ♦ నారదనుత నా
మొరవినుమా కరుణ శ్రీ
ధర హరి పురుషోత్తమ నను ♦ దయఁగను రామా, 67

క. శరదిందు చంద్రికా సమ
దరహాసవదన బిరాన ♦ దయఁ జూపగదే?
కరుణామృత రససాగర
సరసీజాసన సురేంద్ర ♦ సన్నుత రామా. 68

క. వర వీణాగాన వినో
ద రమా హృదయాబ్జ భృంగ ♦ దయఁ జూడగదే?
సురసన్నుత పాదశరణు
కరుణాలయ నన్నువేగఁ ♦ గావవె రామా. 69

క. పరగఁ బ్రతికించితివి భూ
సురు నర్భకుఁ దండ్రివగను ♦ జూడ జనక ని
ర్భరకరుణ నింతకంటెను
బరులెవ్వరు చూపఁగలరు ♦ పావన రామా. 70

క. వరశుభదాయక రఘువర
సరోజమృదుచరణ నిత్య ♦ సత్యప్రవణా
గిరి రచిత సేతుబంధన
పరిహృత దశలపన తమస ♦ భాస్కరరామా. 71

క. శరణని నీదరిఁ జేరితి
సరోజలోచనుఁడ జూడఁ ♦ జాలవె నన్నుఁ
కరుణించి జటాయువుఁ జె
చ్చెర మనుపవె ప్రియసఖుఁడని ♦ శ్రీరఘురామా. 72

క. పురహరణ వినుతచరణా
కరీంద్ర రిపుహరణ దేవ ♦ కంటక దమనా
నిరతము నినుమది నమ్మితి
ఖరకరకుల వార్ధిసోమ ♦ కావవె రామా. 73

క. నారాయణ నీనామము
పారాయణఁ జేయుచుందుఁ ♦ బాయనిభక్తిన్
బారావారవిహారా
రారా ననుగావ వేగ ♦ రాఘవ రామా. 74

క. వరకరుణాసాగర తవ
చరణయుగళి భక్తి నెపుడు ♦ సన్నుతిఁ జేతున్
సురరిపుహరణ మృదుచరణ
పరాత్పర! హరి హర వినుత ♦ పావనరామా. 75

క. నరవర యచేతనంబులె
పరిమ్లానములుగనైన ♦ పట్టిన మనుజుల
సిరిచెడి యేమైరో గదే
శరణాగతరక్షదీక్ష ♦ శాశ్వత రామా. 76

క. గురుడిడిన ముహూర్తంబది
వరపట్టముఁ గట్టనుచుఁ ♦ వమ్మైయది యా
ఖరు రావణుఁ గూల్చుటకై
పరిణామమునొందె లోక ♦ వందిత రామా. 77

క. నరనాథ! పదియునా ర్వ
త్సరములు కాకుండమున్నె ♦ తవిలి ప్రబల మా
ర్తురఁ గూల్పఁ దొడఁగి నాఁడవు
పరమాద్భుతచరిత నిత్య ♦ పావనరామా. 78

క. పురుషవర క్షీరకంఠుని
వరసోదరు వెంటగొని స ♦ పరివారునిగా
సురరిపుని రావణాసురు
పరిమార్చిన నీదుమహిమ ♦ స్వల్పమె రామా. 79

క. శ్రీరమణీయ చరణ సర
సీరుహముల నమ్మినాను ♦ సీతారమణా!
నీరజబంధు కులోద్భవ
వారిజసంభవ సురేశ ♦ వందిత రామా.

క. సురవర పరమదయాకర
సరోజభవ హర సురేంద్ర ♦ సన్నుతనామా
మరువక నిన్నే గొలిచెద
పరమచరిత నన్నుగావ ♦ భారమె రామా. 81

క. నరనాథ లోకనిందను
పరిహారణము సేయుపొంటెఁ ♦ బడతిని సీతన్
వరవహ్నిఁ జొనిపి కొంటివి
పరివాదము సైపఁగలవె ♦ భాస్కరరామా. 82

క. గురునాజ్ఞ యంచుఁ గైకయు
నరనాథ యరణ్యమునకు ♦ నాయమువిడి చె
చ్చెర నంప వృక్షజాతియు
పరిమ్లానము లుగనయ్యె ♦ భక్తిని రామా. 83

క. అరమర లేటికి నాపై?
వరకరుణాకర ముకుంద ♦ వారిజనయనా!
నిరతము నినుమది నమ్మితి
సురేశ వినుతచరణ హరి ♦ సుందరరామా. 84

క. ఖరకర కులాబ్ధిసోమా
ఖరకరుఁ గన్నెరుగనట్టి ♦ కాంతలు గృహముల్
పొరివిడిచి వెడల వీధులఁ
బరిచితివి జగంబునవ్వఁ ♦ బావన రామా. 85

క. కరుణింపవయ్య శ్రీరఘు
వర దశముఖ హరణకరణ ♦ వందిత రణ సు
స్థిర పితృవాక్యకరణ వి
తరణ సుదీక్షా వినోద ♦ దశరథరామా. 86

క. సురముని సేవితచరణా
విరాధముఖ దనుజహరణ ♦ వినుత వితరణా
పరిపంథి భ్రాతృ శరణా
పురారి కార్ముకవిభంగ ♦ భూషణ రామా. 87

క. నిరతము నిన్నే నమ్మితి
సురవర వీరాధివీర ♦ శుభగుణ బృందా
అరమర యేటికి నాపై
నరవర నను గావరార ♦ నరనుతరామా. 88

క. ధరణీ వందిత చరణా
హరి నీలోత్పల శరీర ♦ యంబుజ నాభా
సిరితో విచ్చేయగదే
వరుణాలయ శయన దత్త ♦ వర శ్రీరామా. 89

క. సరసీరుహ మృదు చరణా
కరుణా భరణా బిరాన ♦ కావఁగరావే
శరణాగత భవమోచన
హరినీలమణి సమగాత్రి ♦ యచ్యుతరామా. 90

క. సరసీజోద్భవ వందిత
కరుణారస పూర ధీర ♦ కమలదళాక్షా
దరహాసాంకుర మొప్పఁగ
ధరణీసుతతోడ రార ♦ దశరథరామా. 91

క. నరవర సత్యపరాక్రమ
తరణికులాధీశ యీశ ♦ దయఁ జూపగదే
పరమపురుష భరతాగ్రజ
నిరతము నినునమ్మినాను ♦ నిజముగరామా. 92

క. పరమేశ పరాత్పర రఘు
వర నామొఱవినవదేల ♦ వసుధాధీశా
శరణాగతరక్షక హరి
కరుణారసపూర వేగ ♦ కావవె రామా. 93

క. పురహర వందిత పాదా
కరుణను ననుగావరార ♦ కారుణ్యనిధీ
వరగుణశీల పరాత్పర
పరమపురుష హరి సురేంద్ర ♦ వందితరామా. 94

క. మఱచితివా నను శ్రీరఘు
వర కరుణాకర సురేంద్ర ♦ వందిత చరణా
శరధిశయన పరమపురుష
వరములొసఁగ వేగ రావె ♦ వరగుణ రామా. 95

క. ధీరసుపూజిత చరణా
శ్రీరఘువర పరమపురుష ♦ శ్రితజనపోషా
సారసదళ సమనేత్రా
కోరితి నీపదయుగంబె ♦ కోసల రామా. 96

క. కరిరాజవరద కేశవ
శరణాగత వత్సల హరి ♦ శశిధర వంద్యా
సరసీరుహ దళనయనా
కరుణింపఁగ రార వేగ ♦ కరుణను రామా. 97

క. నీరధిశయన పరాత్పర
నీరధి గర్వాపహరణ ♦ నీరధి తరణా
పారావారగభీరా
సారయశ శ్రీనిశేశ ♦ సమరుచి రామా. 98

క. కరుణింపవేర శ్రీరఘు
వర నీరాకర గభీర ♦ వరగుణసాంద్రా
సరసీరుహాక్ష నీపద
సరసీరుహములను గొల్తు ♦ జయరఘురామా. 99

క. సరహార్యక్ష దయాకర
కరరక్షక చక్రిహస్త ♦ కాంచన చేలా
గరుడతురంగ జనార్దన
ఖరదైత్య నికృంతనహరి ♦ కావవె రామా. 100

క. శూర! వరద రఘువర కరు
ణారస పరిపూర్ణహృదయ ♦ ననుదయగనుమా
సారస దళసమనయన య
పార దయార్ణవ ముకుంద ♦ వరగుణరామా 101

క. హర కలశ జాత్రి కౌశిక
శరభంగ వశిష్ఠ దక్ష ♦ శతముఖ వంద్యా
కరుణింపవయ్య నను నో
కరుణాసాగర సురారి ♦ ఖండన రామా. 102

క. సురపతి తనయుని గూల్చియు
తరణిజు రారాజుఁజేసి ♦ దయఁజూపగలే
దె రమావర హరి కేశవ
ఖరసంహార నన్ను దయను ♦ గావవె రామా. 103

క. కరుణగనవేల నన్నిటు
సురపతినీల సమవర్ణ ♦ సుందర రూపా
వరమునిసతిఁ బ్రోచినయటు
కరుణగనుము భక్తవంద్య ♦ ఘనముగ రామా. 104

క. సరివారిలోన నాపైఁ
గరుణింపక చులకసేయఁ ♦ గా కారణమే
మి రఘూత్తమ నా నేరము
సురేంద్రసుతు నఘముకన్న ♦ శోచ్యమె రామా. 105

క. సరసీరుహాయతాక్షా
సరోజభవజనక వినుత ♦ శాశ్వత కీర్తి
పురహరణ శిలీముఖ ని
ష్ఠుర దానవహరణ దుఃఖ ♦ శోషణరామా. 106

క. సురనాథవంద్య కరుణా
కర నారదమౌనివినుత ♦ ఖగరాడ్వాహా
పురహరణ ధనుర్భంజన
ధరాసుత కరగ్రహణచణ ♦ దశరథరామా. 107

క. ఇరుమాటలాడ నే నని
నరేంద్ర చేసితివి బాస ♦ నరలోకమునన్
బరిరక్షించితి పలువురఁ
దరుఁశిని నను భారముగన ♦ దలఁపకు రామా. 108

క. ఖరకర కులవార్ధి నిశా
కరునకు రామునకు నిత్యకళ్యాణముగా
కరమర్ధిఁ గోరి వ్రాసితి
శరణాగతరక్ష దీక్ష జయ! రఘురామా! 109

సంపూర్ణము



